శ్రీరామ శ్శరణం మమ

# శ్రీమద్వేంకటేశ్వర రామాయణము

(శ్రీమద్వాల్మీకమునకు మూలానువాదము-వచనము)

## అరణ్య, కిష్కింధ కాండలు

## ద్వితీయ సంపుటము


కృతికర్త :

భాషాప్రవీణ, కవిహంస, కవిభూషణ, సి.సి.పి.టి.

**వేదుల వేంకటశాస్త్రి**

ఆస్థాన పండితుడు

శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానము, అనకాపల్లి.





ప్రకాశకులు :

సాధన గ్రంథమండలి, తెనాలి.





వెల : రు. 80-00

యువసంవత్సర
విజయదశమి

ప్రతులకు :

**1. వేదుల వేంకటశాస్త్రి**
టెలిఫోను ఎక్స్చేంజి ఆఫీసు వీధి
అనకాపల్లి - 531 001
విశాఖజిల్లా.

**2. సాధన గ్రంథ మండలి, తెనాలి-522 201.**

ముద్రణ :
వాణీ ఆర్టు ప్రింటర్స్
షరాబ్ బజార్, తెనాలి.



తిరుమల తిరుపతి దేవస్థానములవారి ద్రవ్య సహాయముతో ఈ గ్రంథము ముద్రింపబడినది. వారికి నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు.

— గ్రంథకర్త

# శ్రీరామ భుజంగ ప్రయాత స్తోత్రమ్

శివం నిత్య మేకం విభుం తారకాఖ్యం
సుఖాకార మాకారశూన్యం సుమాన్యం।
మహేశం కలేశం సురేశం పరేశం
నరేశం నిరీశం మహీశం ప్రపద్యే॥

క్వణద్రత్న మంజీర పాదారవిందం
లసన్మేఖలాచారు పీతాంబరాఢ్యం।
మహారత్న హారోల్లస త్కౌస్తుభాంగం
నదచ్చంచరీ మంజరీ లోలమాలం॥

నిజే మానసే మందిరే సంనిధేహి
ప్రసీద ప్రసీద ప్రభో! రామచంద్ర!।
స సౌమిత్రిణా కైకయీ నందనేన
స్వశక్త్యాను భక్త్యా చ సంసేవ్యమానః॥
నమస్తే నమస్తే సమస్త ప్రపంచ
ప్రభోగ ప్రయోగ ప్రమాణ ప్రవీణ।
మదీయం మనస్త్వత్పద ద్వంద్వసేవాం
విధాతుం ప్రవృత్తం సుచైతన్య సిద్ధ్యై॥

సదా రామరామేతి నామామృతం
తే సదా రామ మానంద నిష్యంద కందం।
పిబంతం నమంతం సుదంతం హసంతం
హనూమంత మంతర్భజే తం నితాంతం॥

— శ్రీ శంకరాచార్య

శ్రీరామ శ్శరణం మమ.

# ప్రశంస

కళాప్రపూర్ణ
— శ్రీ చర్ల గణపతిశాస్త్రి
విశాఖపట్నము.

శ్రీ వేదుల వేంకటశాస్త్రిగారు పండితులు. కవులు. వీరు చాల గ్రంథములు వ్రాసియున్నారు. తెలుఁగులో రామాయణాలు చాల ఉన్నవి. అవి గద్యపద్యములలో ఉండుటచే, అందఱకును, సుబోధకములు గావు. వీరు సరళమైన తెలుగు వచనములో, చక్కఁగా వ్రాసి, ఆంధ్రులకు చాల ఉపకారము చేసిరి. వీరిశైలి మృదుమధురమైనది. మానవు లెట్లు నడచుకోవలెనో, తన ప్రవర్తనద్వారా శ్రీ రాముఁడు తానే నడచి, ఆదర్శమైనాఁడు. తండ్రిమాట జవదాటక, అతని సత్యమును గౌరవించి, ఆతని మాటలను సత్యము చేయుటకై అడవుల పాలయి, అనేక కష్టముల ననుభవించెను.

శ్రీ వేంకటశాస్త్రిగారు అనువదించిన భాగములలో అక్కడక్కడ మూల శ్లోకములఁగూడ చూపిరి. "సర్వే వర్ణా యథా పూజాం, ప్రాప్నువంతి సుసత్కృతాః। నచావజ్ఞా ప్రయోక్తవ్యా కామక్రోధవశా దపి" దశరథుఁడు పుత్రకామేష్టి చేయుచు, మంత్రులతో అన్నమాటలివి. దీనికి తెలుఁగులో "వర్ణాశ్రమ ధర్మములకు భంగము కలుగనీయక, యెల్లవారలను వారివారి యభీష్టానుసారముగా గౌరవించవలసినది. కొండఱియెడలఁ గామక్రోధాదులకు అవ

కాశము సంభవించును. వానిని నిగ్రహించి, విసర్జించి పొరపాట్లు జరుగకుండఁ బ్రవర్తించవలెను" అని చక్కగా వివరించిరి. అనవసరముగా ఎక్కువగా ఉండరాదు, తక్కువగానూ ఉండరాదు. ఇది చాల మంచి పద్ధతి. "ధిక్ క్షత్రియ బలం బ్రహ్మతేజో బలం బలమ్" బ్రహ్మతేజస్సే నిజమైన బలము. భౌతిక బలము లన్నియును, బ్రహ్మతేజము నుండి పుట్టిన లేశమాత్రములే.

"పితురాజ్ఞాం పురస్కృత్య పౌరకార్యాణి సర్వశః, చకార, రామో ధర్మాత్మా, ప్రియాణిచ, హితానిచ" శ్రీరాముఁడు తండ్రికిఁ బ్రియముగను, హితముగను ఉండి, ఆతని యాజ్ఞ ననుసరించి పౌరకార్యము లెల్ల జరిపించుచుండెను. ఈవిధముగా వాల్మీకి వ్రాసిన శ్లోకముల ఉటంకించుచు వానియందలి ధర్మసూక్ష్మములను వ్రాసి చూపుట వీరి యనువాదమునందలి ప్రత్యేకత.

శ్రీరాముని సత్యమునకు భంగముగాని విధముగా, కొన్నిచోట్ల వీరు మూలమును సమర్థించిరి. "నాశ్రౌషమితి రాజాన ముపాలబ్ధోఽపి పక్ష్యసి" రాముఁడు రథముపైని, వనములకు వెళ్లుచున్నాఁడు. తండ్రి దశరథుఁడు, ఆతనివెంట నడువలేక నడచుచు, సుమంత్రునితో రథమును వేగముగా తోలకు మనుచున్నాఁడు. అప్పుడు రాముఁడు సుమంత్రునితో, "వేగముగా తోలుము! తోలుము!" అని చెప్పుచు ఇట్లనెను. ఒకవేళ నీవు తిరిగి అయోధ్యకు వెళ్ళినప్పుడు "నేను ఆపమన్నానుగదా, ఎందులకు ఆపలేదు?" అని మా తండ్రిగారు అడిగితే, "నేను వినలేదు" అని తండ్రితో

చెప్పాము. వీరు "నాశ్రౌషం" అన్నదానికి, "అశ్రుతమ్" అనగా వినబడలేదు అని చెప్పినా, చెవులకు వినబడినను నేను పాటించలేదు అనుకొన్నచో, అనృతము లేదని సమర్థించిరి. అదియుంగాక, "నేను వినలేదు" అన్నదానికి చెవులకు వినబడలేదు అనిగాక లక్షణగా "చెప్పినట్లు చేయలేకపోతిని" అనికూడ చెప్పవచ్చును. పైవిధముగా వీరి సమర్థన సరిగానే ఉన్నది.

శ్రీ శాస్త్రిగారు బాల-అయోధ్యకాండలొక సంపుటముగను, అరణ్య-కిష్కింధాకాండలు రెండవ సంపుటముగను ప్రకటించిరి. ఇంతవరకూ ఏమాత్రమును మూలమునకు తక్కువగాకుండ నిపుణశైలిని అనుసరించిరి. మిగిలినకాండలు నిట్లేయుండునని చెప్పగలను.

శ్రీరాముఁ డరణ్యమున మునుల ఆశ్రమములను చూచుటకు రాగా, ఆ మునులు రామునితో ఇట్లను చున్నారు. "తే వయం భవతా రక్ష్యా భవ ద్విషయవాసినః, నగరస్థో వనస్థో వా త్వం నో రాజా జనేశ్వరః" దీనికి "ఓ రామచంద్రా! నీవు మహారాజువు. మా సర్వస్వ భారమును, నీ యధీనము. నీవు సర్వలోక శరణ్యుఁడవు. మేము నీచే రక్షింపఁదగినవారము. ఈ ప్రదేశమంతయు, నీ రాజ్యము లోనిదే. కావున నీవు అయోధ్యలోనున్నను, వనములం దున్నను మాకు నీవే రాజువు." ఇట్లు వ్రాయుట మూలాను సారముగను, చక్కని వివరణప్రాయముగఁ నున్నది.

ఇంక కిష్కింధలో, నిది సుగ్రీవుని మాట "త్వం వయస్యోఽసి మే హృద్యో, హ్యేకం దుఃఖం సుఖం చ నౌ, సుగ్రీవో రాఘవం వాక్య మిత్యువాచ ప్రహృష్టవత్"

అనగా సుగ్రీవుఁడు పరమానందభరితుఁడై "రామా! ఇప్పటి నుండియు, నీ సుఖదుఃఖములు నాకును, నా సుఖదుఃఖములు నీకును సమానముగా ననుభవింపఁ దగినవి" అన్నాఁడు.

ఇంకొక ముఖ్యమైన పద్యమును చూతము. "నాహం జానామి కేయూరే, నాహం జానామి కుండలే, నూపురేత్వభి జానామి, నిత్యం పాదాభివందనాత్" హనుమంతుఁడు మొదలగువారు తెచ్చిచూపిన సీత భూషణాలను రాముఁడు లక్ష్మణునకు జూపి, ఇవి సీతవో కావో? చెప్పుమనెను. అప్పుడు లక్ష్మణుఁడు చెప్పిన మాటలివి.

"అన్నా! ఈమూటయందున్న బాహుపురులుగాని, చెవులకు ధరించు కుండలములుగాని ఎవరివో? నాకుఁ దెలియదు. ఈయందెలు మాత్రము మానదినవే యని చెప్పఁగలను. కారణ మేమందువా? నేనామె మొగము గన్నెత్తి ఎన్నడును తేరిపార చూడలేదు." అని యీవిధమైన మధుర రచనలో శాస్త్రిగా రనువదించిరి. ఇట్లు మచ్చుకి రెండుమూడు చూపితిని. ప్రసిద్ధ శ్లోకములను అందలి ధర్మములను వ్రాయుట చాల మంచిపద్ధతి.

ఈవిధముగా సరళ సుందరరీతిలో వీరి రామాయణానువాదమంతయును సాగినది. ఇది చాల ప్రశంసింపఁ దగిన విషయము. ఇట్లు వీరు రామాయణ మన్నికాండలేగాక, ఇంకను చాలకృతులను రచించు శక్తిని, ఉత్సాహమును, ఆయురారోగ్యములను భగవంతుఁడు శ్రీమన్నారాయణుఁడు వీరికి ప్రసాదించుఁగాక!

25-4-95<br>విశాఖపట్నము

ఇట్లు<br>చర్ల గణపతిశాస్త్రి.



కృతికర్త పితృపాదులు :

# కీ. శే. శ్రీ వేదుల పార్వతీశముగారు



# శ్రీమద్వేంకటేశ్వర రామాయణ

## ప్రథమ సంపుటము - ఆవిష్కరణ సభ

1. శ్రీ వేదుల వేంకటశాస్త్రి, కృతికర్త.
2. శ్రీ యెలమర్తి వరాహనరసింహముగారు, ఆవిష్కర్త.
3. శ్రీ వుప్పల సన్యాసయ్యశెట్టిగారు, సభాధ్యక్షులు.
4. డా. శ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ప్రధానవక్త.



డా. శ్రీ జంపన సూర్యనారాయణరాజుగారు

ఎగ్రికల్చర్, అనకాపల్లి.

భార్య : డా॥ శ్రీమతి విజయలక్ష్మిగారు, M.B.B.S.



శ్రీ కన్యకాపరమేశ్వరీదేవి

అనకాపల్లి

# ఉన్నమాట

"అష్టావధాని"
— శ్రీ ఆశావాది ప్రకాశరావు M.A.,
అనంతపూర్.

శ్రీరామకథ సర్వజగదభిరామ కథ. దీనిని తన అమృత లేఖినిచే ప్రాచేతసుతు, తమ దివ్యగళముచే కుశలవులు విశ్వవ్యాప్తము గావించినారు. శ్రోతలెల్లరు పులకిత గాత్రులై ఆనందాశ్రువులు రాల్చువారే. అపర హనుమదంశులే.

ఇటి పవిత్ర గాథను మాతృభాషలో సరళగద్యాను వాదముచేసి తనజన్మకొక చరితార్థతను సంతరింపదలచు కొన్నవారు శ్రీవేదుల వేంకటశాస్త్రిగారు.

ఉభయ భాషాశోభితులైన వీరు, ప్రాచీన కావ్య రుచుల నెరిగినవారై, ఆంధ్రీకరణమనుమాట కెడముగా రచన సాగించినారు. రసజ్ఞుల నావర్జించుకొనుపట్టులు వీరికి పట్టువడినవి.

శ్రీమద్రామాయణ మొక సూక్తిరత్న నిలయము. ఆసుభాషితాలను రూపాంతరితముచేసి విపణివీథిలో సొంత ముద్రతో అమ్మకానికి పెట్టలేని చిత్తప్రవృత్తి శ్రీవేదుల వారిది. కావుననే కథన శిల్పం పాటిస్తూనే సందర్భ శుద్ధితో

వాటినుటంకించి అందలి మేల్మిని వివరించి సాహితీమర్మజ్ఞులకు కానుక చేసినారు. దీన గల్గు మహోపకారము సహృదయు లెరుంగకపోరు. చిత్తశుద్ధిగల ప్రభుత్వముగాని, ప్రజలుగాని ఇట్టి దీక్షా దక్షతగల పండితకవికి తగిన గుర్తింపు నేగాక, చేయూతను సైతము కలిగించాలి. వారినుండి మరిన్ని గీర్వాణకృతులను అనువాద మావములో రాబట్టుకోవలసియున్నది.

వృద్ధాప్యమున నున్న ఈ సుధీవిధేయుని, అక్షర దీపాలచే లోకుల తమస్సు నడచు మాతసరస్వతి సదా కాపాడుగాత!

వినయ ప్రణయ ప్రణామములతో

— ఆశావాది ప్రకాశరావు
29—8—95

)o — o(

# మండలి మాట

వన్ద్యః స వల్మీకభవో మహర్షిః
విశుద్ధయా యః స్వయమేవ వాణ్యా।
సురస్రవంత్యేవ పతిః పశూనాం
భువోఽవతారాయ కృతావలంబః॥

[గంగ స్వర్గమునుండి నేలకు దిగుచు- నడుమ శివుని శిరమును ఆలంబముగా గైకొన్నట్లు- బ్రహ్మలోకము నుండి పుడమికి అవతరించుచు వాగ్దేవి వాల్మీకి మహర్షిని ఆలంబముగా స్వీకరింతనది. ఆ మహర్షికి నమస్కారము.]

శ్రీరాముని దివ్యగాథ చిరంతనమైనది. అది సార్వకాలికము. అది వేదము. పరమాత్మ వేదవేద్యుడు. ఆయన దశరథరాజ నందనుడై అవతరింపగా ఆవేదము రామాయణమై ఆస్వామిని అనుసరించినది.

"రాముడు పుట్టుటకు ముందే రామాయణం ఉన్నది" అని అధ్యాత్మ రామాయణంలో చెప్పబడి ఉన్నది.

"రామాయణాని బహుశః శ్రుతాని బహుభిః ద్విజైః
సీతాం వినా వనం రామో గతః కిం కుత్ర చిద్వద"

— అధ్యాత్మ- అయోధ్య.

"ఎన్నో రామాయణాలు ఎందరో బ్రాహ్మణులు ప్రవచింపగా ఆలకించి ఉన్నాముకదా! సీతను విడి రాముడు ఒక్కడు అడవికి వెళ్ళినట్లు ఎందైన ఉన్నదా?"

తన వనగమనమును అంగీకరింపని పతితో సీత అన్న మాట ఇది.

ఇదెట్లు సాధ్యము? అన్న ప్రశ్నమునకు ఇచట విశదముగా సమాధానము చెప్పుట సాధ్యముకాదు. అయినను దిజ్మాత్రముగా—

"ప్రతి కల్పమున బ్రహ్మ లోకసృష్టిని పూర్వము వలెనే సాగించును. అచటచట కొంచెము కొంచెము భేదములుండునేకాని ప్రధాన విషయములు మారవు.

"సూర్యా చంద్రమసౌధాతా యథాపూర్వ మకల్పయత్"— అని శ్రుతి.

"ఆవిధాత పూర్వమువలెనే సూర్యచంద్రులను కల్పించెను" అన్న ఈమాట వలన సూర్యచంద్రులు పూర్వసృష్టియందున్నారని తెలియుచున్నది. అంతేకాదు- ఇది ప్రతినిధి వాక్యమై- సూర్యచంద్రులేకాదు- ఎవరెవరు ఈ కల్పమునందున్నారో- వారందరు పూర్వకల్పములో కూడ ఉన్నారని తెలియజేయుచున్నది.

దీనినిబట్టి ఇప్పుడున్న వాల్మీకి రామాయణమే పూర్వకల్పమునందును ఉన్నదని ఈ కల్పమున రాముడవతరింపగా- ఆ వెనుకటి కల్పములోని రామాయణము- లోకములయందు ప్రచారములో నున్నదని- దానినే సీత ఆలకించినదని అర్థము. ఒకవేళ ఈ గ్రంథజాతము భూలోకమునందు కానరాకుండ



కీ. శే. పల్లపోతు సత్యనారాయణ (సతీశ్)

కీ. శే. సుధాకుమారి, కీ. శే. రూపేశ్‌కుమార్

పై వారి జ్ఞాపకార్థము

శ్రీ పల్లిపోతు నాగరాజు దంపతులు



క్రి. శే. కోలవర్తి కన్నయ్య, శ్రీమతి తిరుపతమ్మల

జ్ఞాపకార్థము

కుమారుడు : కోలపర్తి వరహాలుగారు

భార్య : శ్రీమతి రమణమ్మగారు

పోయినను- జనలోక మహాలోకాదుల యందు వీని ఉనికికి ఒక భంగము ఏర్పడదు.

అట్లుకాకున్న హనుమంతునిగూర్చి- ఆయన 'నవ వ్యాకరణవేత్త' అనుట ఎట్లు కుదురును ?

"ఐంద్రం-చాంద్రం-కాశకృత్స్నం-
కౌమారం- శాకటాయనమ్
సారస్వతం-చాపిశలం-
శాకలం-పాణినీయకమ్."

ఇవి వ్యాకరణ శాస్త్రములు. ఇందు పాణినీయము పాణిని విరచితము. ఆపాణిని జనమేజయ మహారాజు కాలము వాడనుటకు తగిన ఆధారములున్నవి. హనుమ త్రేతా యుగమునకు జెందినవాడుకదా! కవి యొక్క- ఆరంభకాలము నకు జెందిన పాణిని యొక్క- వ్యాకరణమును ఆయన ఎట్లు చదువగల్గెను? అన్న ప్రశ్న పుట్టుటలేదా? దానికిని ఇదే సమాధానము. ఈపాణినికి వెనుకకూడ పాణిని ఉన్నాడు. ఆయన రచించిన వ్యాకరణమును హనుమ చదివినాడు అని సమాధానము.

ఈ సమాధానము పెద్దలు చెప్పినదే!

సరి! విశదముగా గాకున్నను సూచనగానైన- రామా యణము యొక్క- సార్వకాలికతను దీనినిబట్టి గుర్తింప వచ్చును.

ఆ రామకథ 'శతకోటి' ప్రవిస్తరమ్ అనినారు. శత

కోటి అనగా 24. అ-క-చ-ట-త-ప-య-శ అని వర్ణములు ఎనిమిది. శ వర్గము 8వది కదా! అందుచే శ అనగా 8 అని అర్థము. త-కో-టి అన్నవి వర్గాద్యక్షరములు కదా! అందుచే 1+1+1=3ను సూచించును. శతకోటి=8×3=24 అన్న అర్థమును ప్రాచీనులు ఈవిధముగా సాధించి—

గాయత్రీ మహామంత్రము నందలి అక్షరములు 24. అవే రామాయణమున 24000 శ్లోకములుగా విస్తరించెనని చెప్పినారు.

వేయి శ్లోకములకు ఒకటిగా గాయత్రీ మంత్రాక్షరములు రామాయణమునందు నిక్షిప్తములై యున్నవి. వానిని ఎత్తి గాయత్రీ రామాయణముగా అచ్చువేసి యున్నారు. దానిని గమనించుట సులభమే. స్థూలముగా— 'బాలకాండము-యజుర్వేదము'; 'అయోధ్యకాండము-ఋగ్వేదము'; 'అరణ్యకాండము-సామవేదము'; 'సుందరకాండము-అధర్వణవేదము'; 'ఉత్తరకాండమే-ఉపనిషత్తులు'— అని గ్రహింపవలెను.

ఇవేవియు నేనై చెప్పిన మాటలు కావు. రామసేతు బంధాది గ్రంథములున్నవి. పరిశీలించుట లేదు. ఒకసారి వానివంక కన్నెత్తి చూచిన 'ఓయి! బాబోయి! మాకేమి తెలియును? అని పండితులు సైతము గుండెలు బాదుకొనవలసినదే!

"వాల్మీకి సూత్రాలు ఉన్నాయి."

'స సీతాధిప కథారాజ లాలిత నవ సుగమ సభాతా!' ఇదొక సూత్రము. అర్థము లేశమైనను దెలియుచున్నదా? లేదుకదా!

కాని ఇందు రామాయణములోని 7 కాండలు, వాని యందు గల సర్గల సంఖ్య తెలుపబడెను. ఎట్లు? అందు రేమో! అయ్యో! ప్రశ్న చిన్నదే! సమాధానము అంత తేలికకాదు.

"నధో రాధా రూప మితి సప్తకాండ వ్యవస్థితిః"
— భారద్వాజ సంహిత.

నధో రాధారూపం=12 92 90. రామాయణములోని 7 కాండములలోని మొత్తము పదములు 'నధోరాధా రూపం' అని లెక్కగట్టి నిర్వచించినారు.

ఇట్లు ఆ ప్రాచీనులు- రామాయణముపై సాగించిన పరిశ్రమము ఇంత-అంత కాదు. అట్లు వారు పరిశ్రమించుటకు రామాయణము యొక్క మహామహిమయే కారణము.

'ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్' అన్నారుకదా! ఆపన్నివారణకు రామాయణము. గ్రహదోషశాంతికి రామాయణము. కాంక్షితార్థ ప్రాప్తికి రామాయణము! అది కల్పవృక్షము! దాని నాశ్రయించి "కోరిక తీరలేదు. ఆపద తొలగలేదు" అనువాడు ఈ కలియందును (నేడును) లేడు. అందుచేతనే-

యావత్ స్థాస్యన్తి గిరయః సరితశ్చ మహీతలే।
తావద్ రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి॥

"కొండలు-నదులు ఉన్నంతవరకు లోకములయందు రామకథా ప్రచారము సాగును" అన్నారు.

కొండలు నదులు లేకుండ లోకములుండునా? ఉండవు కదా! లోకములున్నంతవరకు రామకథ ఉండునన్నమాట.

దీనినే కొంచెం ఇటు అటు తిరుగవేసి చూద్దాం! "లోకము లున్నవి-రామకథ ఉన్నది— రామకథ ఉన్నది-లోకములున్నవి". ఇందు కార్యమేది? కారణమేది? ఆధారమేది? ఆధేయమేది?

రామగాథకు లోకమాధారమా? లోకమునకు రామగాథ ఆధారమా?

"అయ్యా! "శ్రీరాముని దివ్యగాథపై ఆధారపడి లోకములున్నవి" అన్నది సత్యము!

ఈ వేములవారు మంచి కవులు-పండితులు. అన్నిటిని మించి వీరి జీవనమునకెల్ల వెలుగైనది- వీరికి గల రామభక్తి! కుటుంబము సాగుటకై ఏదో ఉద్యోగము సాగించుచు-మనస్సును శ్రీ సీతారాముల పాదపీఠమున బద్ధమొనర్చిన వీరి కౌశలము గృహస్థులు కెల్లరకును ఆదర్శ ప్రాయమైనది. (యోగః- కర్మసు కౌశలమ్) పండితులు-కవులు-విశేషించి శ్రీరామ భక్తులు అయిన వేములవారు ధన్యులు!

రామాయణమును పూర్తిగా సరసమైన తేట తెనుగు వచనమున అనువదించి, తాము తరించుటయేకాక - సంస్కృత భాషా పరిజ్ఞాన దూరమైన నేటి ఆంధ్రలోకమునకు వీరొనరించిన ఉపకృతి అనన్యసామాన్యమైనది.

ఇది అందలి రెండవ భాగము. వాల్మీకి మహర్షి యొక్క కవితా వైభవము - శ్రీరాముని దివ్యగాథా సౌందర్యము— "అయ్యో! మా అనుభవమునకు అందుటలేదే! మేము సంస్కృతభాషను లెస్సగా అభ్యసింపకపోయి నారమే"- అనుచు ఎవ్వరును వాపోవనక్కరలేదు.

ఈ వేదుల రామాయణము - శ్రీమద్ వాల్మీకి రామాయణమునకు అద్దము. అది బింబము! ఇది ప్రతిబింబము!

ఈ వేదులను (అరుగులను, మెట్లను) అనుసరింపుడు! శ్రీరామ కథాసుధా తరంగిణియందు అశ్రమము ఓలలాడి తరింపుడు!

ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం - వేదైశ్చ సమ్మితమ్।
యః పఠేద్ రామచరితం - సర్వపాపైః ప్రముచ్యతే॥

సాధన గ్రంథ మండలి
తెనాలి

బులుసు సూర్యప్రకాశశాస్త్రి

o) — o(

శ్రీరామ శ్శరణం మమ.

# కృతజ్ఞతలు

శ్లో॥ రామఏవ, పరం బ్రహ్మ, రామఏవ, పరంతపః।
రామఏవ, పరం తత్త్వం, రామాన్నాస్తి, పరాయణమ్॥

"రామో విగ్రహావాన్ ధర్మః" అన్నది క్రూర రాక్షసుండైన మారీచుండు. "తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్" అని శ్రీరామునకు బద్ధశత్రువై, రాక్షసరాజైన రావణాసురుండు చివరకు తెలిసికొని యన్న మాట.

విరాధుండు, కబంధుండు, శబరి మొదలైనవారు శ్రీరామదర్శన స్పర్శనాదులచే మోక్షమును బొందిరి. ఇంక శరభంగ మహర్షి మొదలగు మునిపుంగవులను లెక్కింప దరముగాదు. నాటికి, నేటికి, ఏనాటికిని శ్రీరాముండే సర్వ ధర్మములకును ఆదర్శమైన వాండనక తప్పదు. ముక్కోటి దేవతలలో, సర్వజగద్రక్షకుండు శ్రీరాముండే. "శ్రీరామ రక్ష" అన్నది రామునకే రూఢియైనది. శ్రీరామరాజ్యము కావలెనని ఏనాటికిని ప్రజలు కోరుచునే యుందురు. ఎంత మంచి మహారాజు లెంతెంత త్యాగములు చేసి పాలించినను, ఎవరికిని ఇట్టి సార్థకత్వము లేదు.

మనకు 18 మహా పురాణాలు, 18 ఉపపురాణాలు ఇంకా ఇంకా ఎన్నెన్నో కావ్యనాటకాదులు గలవు. వానిలో శ్రీమచ్ఛబ్దము, రామాయణ, భగవద్గీత, భాగవతములను

మూడింటికే కలదు. అందు మొదటిది శ్రీమద్రామయణము.

"వేద వేద్యే పరే పుంసి, జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా"

అనినిబట్టి శ్రీమద్రామయణము వేదమే. శ్రీరాముఁడు సాక్షాత్తుగాఁ బరమాత్మయే.

ఆ కాలములో వేదము ఏకొందఱికో అర్థమయ్యేది. అందుచే లౌకికమైన, సరళ, సంస్కృతభాషలో వాల్మీకి మహర్షి అందరకు నర్థమగునట్లు వ్రాసినాఁడు. తరువాత కాలము గడచిన కొలదియు, తెలుఁగు పద్యములే అర్థము చేసికొనలేని పరిస్థితి ఏర్పడినది. అందులకే యేమో శ్రీరాముఁడు నాచే యీకావ్యమును తేటతెనుఁగు భాషలో వచనముగా అనువదింప చేసినాడనిపించుచున్నది. కానిచో ఏపనిని సాధించలేని గుండెపోటు జబ్బుగల వృద్ధుఁడనైన నేనెక్కడ? 24 వేల శ్లోకములు గలిగి 7 కాండలుగా నున్న వాల్మీకి రామాయణమును దెనుగు వచనములో నేను వ్రాయుటెక్కడ? అది యీనాటికిని నాకే ఆశ్చర్యకర మగుచున్నది. దీనిని వ్రాయుటకు శ్రీరామానుగ్రహముతప్ప నాలో ఏమాత్రమును శక్తి లేదు.

వేలకొలది పుటలుగల (వ్రాతలో) ఈ మహాగ్రంథము పూర్తికాగానే దీనిని ఆర్థికస్తోమతలేని నేను ప్రచురించఁగలనా? యన్న సందేహమున్నను శ్రీరామునిపై భారముంచి, సాధన గ్రంథ మండలి వ్యవస్థాపకులైన (తెనాలి) శ్రీబులుసు సూర్యప్రకాశశాస్త్రిగారిని ప్రార్థించఁగా, వారును నాకంటె వయోవృద్ధులై యున్నను శ్రీరామ రూపములో అభయ

మిచ్చిరి. ఆ వెంటనే మొదటి సంపుటము (బాల-అయోధ్యా కాండలు) శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానములవారికి వ్రాత ప్రతిని బంపుకొనఁగా వారును పరిశీలింపజేసి రు. 10 వేలు విరాళముగా నిచ్చిరి. ఆ ధైర్యముతో గ్రంథ ముద్రణము నారంభింపజేసి నా మిత్రులు, శిష్యులు, వదాన్యులు, భక్తవరేణ్యులు చాలమంది వారివారి ఫొటోల నిచ్చి తగినంత ధన మొసంగిరి. ఆవిధముగా ప్రథమ సంపుటమును శ్రీరాముడే వెలువరింపజేసినాఁడు.

ప్రస్తుతము ఈ ద్వితీయ సంపుటమును గూడ (అరణ్య-కిష్కింధ కాండలు) శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానములవారికి వ్రాతప్రతిని బంపుకొనఁగా, రు 15 వేలు విరాళముగా నిచ్చుటకు ప్రకటించిరి. శ్రీవారికి నాకృతజ్ఞతాభివందనములు.

మొదటి సంపుటమునకు వలెనే ఈ రెండవ సంపుటమునకు గూడ చాలామంది వదాన్యులు విరాళముల నిచ్చిరి. ఇంతవరకును రెండు సంపుటములను శ్రీరామానుగ్రహముచే ప్రచురించగలిగితిని. శ్రీరామచంద్రమూర్తి ఈ వదాన్యుల కందరకును 'సకల సౌభాగ్యముల నిచ్చి రక్షించుగాక' యని ప్రార్థించుచున్నాను. ఇట్లే మిగిలిన 3 కాండలును ప్రచురించుటకు భక్తులైన వదాన్యులు సహాయపడగలరని దృఢముగా ఆశించుచున్నాను.

మానవ సంస్కృతీ సంప్రదాయములతో గూడిన ధర్మమునకు మూలగ్రంథమైన శ్రీమద్రామాయణము సంస్కృతమునందు వ్రాయబడినది. ఆంగ్ల పరభాషా వ్యామోహ

ములో బడి, స్వమాతృభాషనే నిర్లక్ష్యము చేయుచున్న యీరోజులలో, శ్రీమద్రామాయణ ప్రచారము ఎంతైనా అవసరమని శ్రీరాముడే నాకుశక్తినిచ్చి యీపని చేయించె నని నా ప్రగాఢ విశ్వాసము.

నేనీ గ్రంథమును వ్రాయుటకును, ప్రచురించుటకును నాకు సంపూర్ణ సహకారముల నందించి ప్రోత్సహించిన వారందరకును నాకృతజ్ఞతాపూర్వక అభినందనలు. నా బాల్యమునుండి నేటివరకును నారచనలకును, నా జీవితమున కును దగిన ప్రోత్సాహమిచ్చిన కీ. శే. శ్రీ వుప్పల శ్రీరామ మూర్తి, కీ. శే. శ్రీ డా॥ బెండపూడి పేర్రాజు, కీ. శే. డా॥ జి. వి. ఎల్. నరసింహము, శ్రీ డా॥ భైరవభట్ల వేంకట విశ్వనాథము గార్లకు సర్వదా నా కృతజ్ఞతలు. ఎప్పటి కప్పుడు నాకు ధనసహాయము చేయుచు, జ్యేష్ఠసోదర భావ ముతో నన్ను గౌరవించు శ్రీమతి గొల్లపూడి లలితాంబను శ్రీ రామచంద్రుఁడు సకల శ్రేయోభివృద్ధిగా రక్షించుచుండు గాక!" యని ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథ ప్రథమ, ద్వితీయ సంపుటములను జదివి, శుభాశీఃపూర్వకమైన అభిప్రాయముల నొసంగిన కళా ప్రపూర్ణ శ్రీ చర్ల గణపతిశాస్త్రిగారికి, అష్టావధాని శ్రీ ఆశావాది ప్రకాశరావు M.A. Phd. గారికిని నా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనములు.

ఇట్లు

25-9-1995 | బుధజన విధేయుఁడు

అనకాపల్లి | కవిహంస, వేదుల వేంకటశాస్త్రి

ఈ ద్వితీయ సంపుటమునకు ఉదారముగా
ఐదు వేల రూపాయలు విరాళముగా
ఇచ్చిన వదాన్యులు-

శ్రీ భైరవభట్ల చిన నరసింగరావు

చి॥ సౌ॥ శకుంతల దంపతులు

హైదరాబాదు.

వీరికి నా శుభాశీస్సులు.

— గ్రంథకర్త.

శ్రీరామ శ్శరణం మమ

# శ్రీమద్వేంకటేశ్వర రామాయణ ద్వితీయ సంపుటమునకు విరాళములిచ్చిన వదాన్యులు

## మహారాజ పోషకులు

1) శ్రీ శ్రీ శ్రీ సీతారామాంజనేయస్వామి
2) శ్రీ శ్రీ శ్రీ మత్తిరుపతి-తిరుమల దేవస్థానమువారు తిరుపతి
3) శ్రీ భైరవభట్ల చిననరసింగరావు, శకుంతలా దంపతులు హైదరాబాద్
4) శ్రీమతి గొల్లపూడి లలితాంబగారు అనకాపల్లి
5) శ్రీ డా॥ భైరవభట్ల వేంకట విశ్వనాథముగారు ,,
6) శ్రీ డా॥ జె. వి. యస్. యన్. రాజు, డా॥ విజయలక్ష్మి దంపతులు అనకాపల్లి
7) శ్రీ పల్లపోతు నూకరాజు, రత్నకుమారి దంపతులు అనకాపల్లి
8) శ్రీ కడ్మిసెట్టి సూర్యప్రకాశరావు, పాపరత్నం దంపతులు అనకాపల్లి
9) శ్రీ కొయ్యా చినసత్యనారాయణరెడ్డి, కాంతమ్మ దంపతులు అగనంపూడి
10) శ్రీ మెలవర్తి వరాహనరసింహము, సన్యాసమ్మ దంపతులు లంకెలపాలెం